





# కథలు

నీతి, పురాణ, పొడుపు

# పరిత్యాగం





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035176

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పరిత్యాగం

## మరికొన్ని ఇతర కథలు

రవీంద్రనాథ ఠాకూర్

అనువాదం:

బెల్లంకొండ రామదాసు

నన్నపనేని సుబ్బారావు



రవీంద్రగ్రంథమాల, విజయవాడ-2

# పరిత్యాగం

అది ఫాల్గుణమాసం రాత్రి. మామిడిపూత సువాసనలు తోడు చేసుకుని పిల్లవాయువులు వీస్తున్నవి. చెరువు గట్టున దట్టమయిన చెట్ల ఆకుల్లో నుంచి రాత్రింతలు జాగారం చేసే చాతకపక్షి స్వరం, ముఖర్జీల యింట్లో నిద్ర లేని పడక గదిలోనికి ప్రవేశిస్తూవుంది. హేమంతుడు కొంచెం విలాసంగా భార్యజడ విప్పి, ఆమె శిరోజాలు వ్రేలికి చుట్టుకుంటున్నాడు; మరోసారి ఆమె గాజులకు, మురుగులకు తగాదాపెట్టి విచిత్రధ్వని సృష్టిస్తున్నాడు;మళ్ళీ యింకోసారి ఆమెతలలోని పూలచెండు తీసి, ఆమె మోము మీద వుంచుతున్నాడు. సాయంవేళ స్తబ్ధుగావున్న పూ మొక్కలకు చైతన్యం కలిగించటానికి, ఒకసారి అటు నుంచి ఇటూ, యిటునుంచి అటూ, వుయ్యాలలూపే గాలి మాదిరిగా వుంది హేమంతుని పరిస్థితి కూడా !

కాని కుసుమ యెదురుగా వెన్నెలలో తేలియాడుతున్న అనంత శూన్యంకేసి దృష్టినిగిడ్చి, నిశ్శబ్దంగా కూర్చునివుంది. భర్త విలాసతరంగాలు ఆమెను స్పృశించి

విరిగి వెనుదిరిగి వస్తున్నవి. చివరకు అతను కొంచెం అధీరతతో—"కుసుమా, నీవు యే లోకంలో విహరిస్తున్నావు ? దుర్భిణీయంత్ర సాయంతో పరిశీలనగా చూసినా, బిందు మాత్రంగా కన్పించేటంత దూరానికి వెళ్ళిపోయావు! యివాళ నీవు నాకు మరీ సన్నిహితంగా వుండాలని నాకు మహా వుబలాటంగా వుంది. చూడు, యెంత మధుర యామమో !" అన్నాడు.

కుసుమ హేమంతునికేసి చూస్తూ—"ఈ వెన్నెల రాత్రి, యీ పిల్లవాయువులు, తక్షణమే రూపు మాసిపోయే మంత్రం నా దగ్గర వుంది !" అని చెప్పింది.

"అలాంటి మంత్రం వుంటే, యిప్పుడు పఠించాలిసిన పనిలేదు,—వారానికి రెండు మూడు ఆదివారాలు గాని సెలవులుగాని, రాత్రి మర్నాటి సాయంత్రందాకా వుండేటట్టు గాని, చేయగల మంత్రంవుంటే మాత్రం, వినటానికి సిద్ధంగా వున్నాను." అని చెపుతూ అతను కుసుమను యింకా దగ్గరకు తీసుకోబోయాడు. కాని ఆమె, అతని ఆలింగన బద్ధురాలవకుండా—"నేను ప్రాణాలు విడుస్తూ మీతో చెప్పవలెననుకున్న విషయం యివాళే చెప్పాలని పిస్తోంది. అప్పుడు నాకు మీరు యెలాంటి శిక్ష విధించినా సంతోషంతో స్వీకరిస్తాను." అని చెప్పింది.

హేమంతుడు శిక్షను గురించి జయదేవుని గీతం ఒకటి విన్పించి, రసికత్వం సృష్టించే ప్రయత్నంలో వున్నాడు. అంతలో యెవరో నిప్పులు కక్కుతూ వస్తున్నట్టు, పాదరక్షల చట చట విన్పించింది. ఆ సవ్వడి మరెవరిదో కాదు, హేమంతుని తండ్రి హర హర ముఖర్జీది! హేమంతుడు కంగారుపడి నట్టుంది.

హరిహరబాబు గుమ్మం వద్దకు వచ్చి కోపంతో గర్జిస్తూ "హేమంత్, నీ భార్యను తక్షణమే యింట్లోనుంచి బయటికి పంపించివెయ్!" అన్నాడు.

హేమంతుడు భార్య మోము కేసి చూశాడు. కాని ఆమె యే మాత్రం ఆశ్చర్యపోయినట్టు లేదు. ఆమె రెండు చేతులతో ముఖంకప్పుకుని తనసమస్త శక్తి సంకల్పాలతో యీ ప్రపంచంలోనుంచి అంతర్ధానం కావటానికి యత్నిస్తున్నట్టుంది. పిల్లవాయువులతో పాటు, చాతకపక్షి కమ్మని కంఠస్వరం యథాప్రకారమే గదిలోకి ప్రవేశిస్తూంది కాని యెవరి చెవినీ చొరటంలేదు. ప్రపంచం అనంతసౌందర్య రాశి అయినప్పటికీ, యింత శీఘ్రంగా వైకల్యానికి దారి తీసింది!

## 2

హేమంతుడు లోనికి తిరిగివచ్చి భార్యను—"యీ విషయం యదార్థమేనా?" అని అడిగాడు.

"అవును; యదార్థమే !"

"మరి యిన్నాళ్ళనుంచి నాతో యెందుకు మాట మాత్రమయినా అనలేదు ?"

"చాలాసార్లు ప్రయత్నించాను కాని నావల్ల కాలేదు. నేను పాపాత్మురాలని !"

"అయితే యివాళ వివరంగా చెప్పు !"

కుసుమ గంభీరంగా దృఢస్వరంతో యావద్వృత్తాంతమూ పూసగుచ్చినట్టు చెప్పింది. ఆ చెప్పేటప్పుడు, ఆమె ధీరగమనంతో అడుగు నిడుతూ, మండే నిప్పుల్లో నుంచి బయటికివచ్చి నట్టుంది. అగ్నిదేవునికి యెంత వరకు ఆహుతి అయిందీ యెవరికీ అర్థంకాలేదు. హేమంతుడు అంతా విని లేచివెళ్ళాడు.

వెళ్ళిపోయిన ప్రాణనాథుని మళ్ళీ పొందలేననుకున్నది కుసుమ. ఆమెకు యేమీ అబ్బురగ మనిపించలేదు. ప్రపంచంలోని అనేక సంఘటనల మాదిరే, యిది కూడా చాలా స్వాభావికంగా తటస్థించిది.—ఆమె మనసులో యిలాంటిదే ఒక శుష్క అచేతనత్వం కదల బారింది. ఆమెను పదే పదే యీప్రపంచం, యీప్రేమ, అద్యంతాలూ అసత్యంగా శూన్యంగా గోచరించసాగినవి. హేమంతుని అతీత ప్రేమ సంభాషణ తలచుకుని, నీరసము, నిరానందము అయిన

శుష్కహాసం చేసింది. ఆ నవ్వు పదునైన కత్తిమాదిరి ఆమె మనసును యీ ప్రక్కనుంచి ఆ ప్రక్కకుదూసుకు పోయింది. కుసుమ యే ప్రేమను యింత గొప్పగాభావించిందో, యెందులో మమత్వము. అన్యోన్యత పుట్టిపడుతుండేదో, క్షణకాలసంయోగ వియోగాలు అమితానందంగా, బాధాకరంగా పరిణమించేవో, దేనికి ఆద్యంతాలు గోచరించేవికావో, జన్మ జన్మాంతరాల్లో కూడా దేనికి విచ్ఛేదమనేది, వూహకు అందని విషయమో, అదేనా యీ ప్రేమ! ఆ ప్రేమ యింత దుర్బలమైన పునాది మీద నిలిచివుందా! సమాజం వొక్క వూపు వూపగానే, యిసుక గోడ మాదిరి కూలిపోయింది. హేమంతుడు ఇప్పుడే, కొద్ది క్షణాల క్రితం గద్గద కంఠంతో "యెంత మధుర యామిని!" ఆమె చెవిలో చెప్పాడు! ఆ రాత్రి యింకా గడవలేదు; యింకా చాతపక్షి కూస్తూవుంది; అవే పిల్ల వాయువులు మంచపు దోమ తెరను వుయ్యాలలూపుతున్నవి; ఆ వెన్నెలే సుఖశ్రాంతయైన సుందరి మాదిరి, కిటికీ వద్దవున్న మంచానికి వొక ప్రక్కన వినీలావస్థలో పడువుంది! అయితే యిదంతా మిధ్యా, అసత్యమూ, మాయా! మరి ప్రేమ, వాటన్నిటినీ మించిపోయిన అపూర్వ మాయా!

## 3

మర్నాడు వుదయమే నిద్రలేక, ముఖాన కాళా కాంతులులేని హేమంతుడు వున్మత్తుని మాదిరి ప్యారీ శంకరుయింటికి పరుగెత్తాడు. ప్యారిశంకరు — "విశేషా లేమిటి హేమా !" అని అడిగాడు.

హేమంతుడు నిప్పులు కక్కుతూ, ఆపాదమస్తకం కంపిస్తూ —"నీవు మమ్ములను కుల భ్రష్టుల్ని చేశావు; నన్ను సర్వనాశనం చేశావు. నీవు దీనికి తగిన శాస్తి అను భవించాలి!" అంటుండగానే అతని కంఠం పట్టుకుపోయి, మాట రాలేదు.

ప్యారీశంకరు మందహాసం చేస్తూ —"మరి మీ రందరూ మాకులం వుద్ధరిస్తిరి; మా సమాజాన్ని రక్షిస్తిరి! నన్ను జోలపాడి సుఖనిద్ర పుచ్చారాయె! నేనంటే, మీ అందరకూ మితిలేని కనికరమూ, ప్రేమ! కాదూ ?" అన్నాడు.

హేమంతుడు తక్షణమే అతన్ని భస్మం చెయ్యా లనుకున్నాడు. కాని ఆ కాకకు తానే గురికాసాగాడు! ప్యారీ శంకరు నిశ్చింతగా నిమ్మకు నీరెత్తినట్టు కూర్చున్నాడు.

హేమంతుడు డగ్గుత్తికతో—"నేను నీకేం అపకారం చేశాను?" అన్నాడు.

"నాకు ఒక్కగాను ఒక్క కూతురు. ఆపసికాయ మీ తండ్రికి యేం అపకారం చేసిందో చెప్పు! నీకు అప్పటికి వూహ లేదు; పసివాడివి. దీనిలో గర్భితంగా వున్న రహస్యాలన్నీ బయటకు వచ్చినప్పుడు చూడాలి తమాషా!" అనిచెప్పి, ప్యారీశంకరు క్షణ కాలం ఆగి మళ్ళీ చెప్పసాగాడు:

సావధానంగా విను, నా అల్లుడు నవకాంతుడు నా కుమార్తె నగలు అపహరించి, విదేశాలు పారిపోయే నాటికి నీవు యింకా క్షుద్రవాడివి. అయిదారు సంవత్సరాలకు అతను బారిస్టరు అయి, స్వదేశానికి తిరిగివచ్చినప్పుడు వూళ్ళో పెద్దతుఫాను చెలరేగింది. నీకు లీలగా గుర్తుందో లేదో చెప్పలేను గాని నీవు అప్పుడు కలకత్తా స్కూల్లో చదువుతున్నావు. మీ తండ్రి న్యాయపీఠం అలంకరించి —'యిష్టమయితే, కుమార్తెను కాపురానికి పంపు; కాని ఆ పిల్ల యెప్పటికీ పుట్టింట్లో అడుగు పెట్టరాదు!" అని వుత్తరువు యిచ్చాడు. నేనుకాళ్ళు-గడ్డం పట్టుకుని ప్రాధేయపడ్డాను. "అన్నాయి! యీ సారికి నా పరువు నిలుపు. నేను అల్లుడికి ఆవు పేడతో శుద్ధిచేశాను. మీరు వాణ్ణి కులంలో

కలుపుకోండి!" అని బ్రతిమాలాను. మీ తండ్రి యెలానూ సమ్మతించలేదు; నేనూ ఆ ఒక్క పిల్లనూ వదులుకో లేకపోయాను. కులానికి, వూరికి ఒక సలాం కొట్టి, కలకత్తా వచ్చి వుంటున్నాను. కాని యిక్కడకు వచ్చినా, ఆపీడ విరగడ కాలేదు. నేను మా అన్న కొడుకు పెళ్ళి ప్రయత్నాలన్నీ పూర్తి చేసుకున్నాను. అంతలో మీ తండ్రి వచ్చి, కన్యాపక్షంవారిని రెచ్చగొట్టాడు—అంతే, ఆ పెళ్ళి ముడిపడలేదు. అర్ధమయిందా! దీనికి ప్రతీకారం చేయకపోతే, బ్రాహ్మణబిడ్డను కాదని నేనూ శపథం చేశాను! యిప్పుడు కొంతవరకూ అర్ధమయి వుండవచ్చు! కాని యింకా కొంచెం వినాలి. అంతావిని, నీవుచాల ఆనందిస్తావు. యిందులో కావ్య శ్రవణాన్ని మించిన, బ్రహ్మానందం వుంది.

అప్పటికి నీవు కాలేజీలో చేరావు. మీ బోర్డింగు దగ్గర్లోనే విప్రదాసు ముఖర్జీగృహం వుంది. అతను చాల పెద్ద మనిషి! యిప్పుడు లేడు. చటర్జీగారి యింటిని ఆశ్రయించుకుని, ఒక అనాధ కాయస్థబాల విధవ వుంటూవుంది. పిల్ల పేరు కుసుమ; చక్కని చుక్క. ఆ వృద్ధబ్రాహ్మణుడు కాలేజీ విద్యార్ధుల దృష్టి కుసుమ మీద పడకూండా చూడడం యెలానా అని కొంచెం విచారగ్రస్తుడయ్యాడు.

కాని వృద్ధుల కనుగప్పటం ఆడపిల్లకు చాల సాధారణమైన విషయం! కుసుమ తడి బట్టలు ఆరవేయటానికి యెక్కువగా డాబామీదికి వెళ్తుండేది; నీకు డాబామీద వల్లి స్తేగాని పాఠాలు వంట పట్టేవి కాదను కుంటాను. అక్కడ మీరిద్దరూ మాట్లాడుకొనే వాళ్ళో లేదో ఆపర మాత్ముడికే తెలియాలి. కాని ఆ పిల్ల వైఖరి చూసి, వృద్ధుడు గట్టిగా శంకించాడు. ఎందువల్లనంటే, పని పాటల్లో కుసుమ వల్ల చాల పొరపాట్లు దొర్లుతున్నవి; తపస్విని గౌరి మాదిరి, నానాటికి నిద్రాహారాలు దూరం కాసాగినవి. ఒకొక నాటి సాయంత్రం నిష్కారణంగా వృద్ధుని యెదుటనే పొంగి పొరలి వస్తున్న కన్నీటిని నిగ్రహించుకోవటం కష్టమైపోయేది.

డాబామీద వేళాపాళా లేకుండా, నీరవంగా మీ యిద్దరి చూపులూ కలుస్తున్నవని వృద్ధుడు పసికట్టాడు. నీవు కాలేజి యెగగొట్టి మిట్టమధ్యాహ్నవేళ మెట్లగది చూరు నీడను కూర్చుని, పేజీలు తిరగవేస్తుండేవాడివి; యేకాంత అధ్యయనమంటే, ఆకస్మికంగా నీలోవుత్సాహం మినుముట్టింది! విప్రదాసు సలహాకోసం నావద్దకు వచ్చి నపుడు— "కక్కాయి, నీవు యెలానూ కాశీ వెళ్ళాలని ఆలోచిస్తుంటివి —ఆ పిల్ల నావద్ద వుంటుంది; నీవు తీర్థవా

సానికి నిశ్చింతగా వెళ్ళవచ్చు: ఆ పిల్ల బరువు భారం నేను వహిస్తాను" అని చెప్పాను.

విప్రదాసు కాశీవాసం వెళ్ళిపోయారు. నేను కుసుమను శ్రీపతి చటర్జీ యింట్లోవుంచి, అతనే ఆ పిల్లతండ్రి అని నలుగురికీ చెప్పి, నమ్మించాను. తర్వాత విషయం నీకు తెలియనిదేముంది! నిజంగా మొదటినుంచీ జరిగింది చెపుతూవుంటే, కథ చెపుతున్నట్టు నేను ఆనందపడుతున్నాను. యీ కథంతా పూర్తిగా వ్రాసి, పుస్తకరూపంలో ప్రకటించాలని నామనసు తహతహ లాడుతూ వుంది. కాని, నేను రచయితను కాను! మా అన్నకొడుకు యేదో వ్రాస్తుంటాడట, వాడిచేతనైనా పూర్తి చేయించాలని వుంది. కాని, మీరిద్దరూకలిసి వ్రాస్తేనే బాగుంటుంది; కారణం కథ యెలా ముగించాలో నాకు తెలియదుగదా!"

హేమంతుడు అతని చివరిమాటలు అంత శ్రద్ధగా వినకుండా—"కుసుమ యీ పెళ్ళికి యేమీ అభ్యంతర పెట్టలేదా?" అని అడిగాడు.

ప్యారీశంకరు చెప్ప నారంభించాడు మళ్ళీ:

"కుసుమ యిష్టానిష్టాలు గ్రహించటం కష్టం! నీకు తెలియనిదేముంది నాయనా, స్త్రీల మనసు ఆ సృష్టికర్తకే అగమ్యగోచరమని చెపుతారు—వాళ్ళు 'అవునంటే'

కాదనీ, 'కాదంటే' అవుననీ, మనం అర్థం చేసుకోవాలి! కుసుమకు కొత్తయింట్లో నీ దర్శనభాగ్యం కలగనందుకు మనసు మనస్సులోలేదు; పిచ్చి అవతారం పడిపోయింది. నీవూ యెలానో ఆయింటి ఆరా తీసుకున్నావు! నీవు కాలేజీ దారి మరచి, పుస్తకాలు చేతపట్టి, శ్రీపతి యింటిముందు యేదో అన్వేషిస్తుండేవాడివి! నీ వైఖరి చూస్తే, కాలేజీమార్గం అన్వేషిస్తున్నట్టుండేది కాదు. కారణం, పెద్దమనుషుల యింటి కిటికీ వూచలలోనుంచి క్రిమికీటకాలు, ఉన్మత్తయువకుల హృదయాలు మాత్రమే ప్రవేశించటానికి వీలవుతుంది! అయినా, యీ కాండ యావత్తూ చూసి, నాకు విచారం కలిగింది; ఒక చెంపన నీ చదువూ సాగటంలేదు; మరోచెంప కుసుమ ఆరోగ్యం కూడా నానాటికి తీసికట్టుగా వుంది!

నేను ఒకనాడు కుసుమను దగ్గరకు పిలిచి— "అమ్మాయీ, నీవు నా ముందర సిగ్గిలనక్కరలేదు! నేను వృద్ధుణ్ణి! నీకు తండ్రిలాంటి వాడిని! నీవు మనసులో యెవర్ని ప్రేమిస్తున్నావో నే నెరుగుదును. ఆ కుర్రవాడిస్థితీ నీమాదిరే వుంది. మీ యిద్దరినీ వొక యింటి వాళ్ళను చేయాలని నా సంకల్పం!" అని చెప్పాను. ఆ మాట వినగానే కుసుమ బావురుమని యేడుస్తూ, అక్కడి

నుంచి లేచి లోనికి పరుగెత్తింది. యిలా, అయినప్పుడు కానప్పుడు శ్రీపతి యింటికి వెళ్తూ కుసుమను దగ్గరకు పిలిచి నీ ప్రస్తావన తెచ్చి క్రమంగా నాముందర సిగ్గు, సంకోచాలు లేకుండా చేయగలిగాను. నిత్యమూ యిదే విషయం చర్చించి, వివాహమే శరణ్యమని నూరిపోశాను. కుసుమ 'అదెలా సంభవం?' అన్నది. 'కులీనబాలిక' అని చెపుతానని సమాధానమిచ్చాను. దీర్ఘంగా చర్చ జరిగిన తర్వాత ఆ బాలిక నీ అభిప్రాయం తెలుసుకోవా లన్నది. 'అసలే ఆ కుర్రవాడు మారురూపు పడిపోయాడు. దానిమీద యీ గందగోళమంతా అతని చెవిని వేయటం దేనికి? నిర్విఘ్నంగా, ప్రశాంతంగా వివాహం జరిగిపోవ టమే యిద్దరకూ శ్రేయస్కరం! రహస్యం బయట పడుతుందనే సందేహంలేనప్పుడు, వృథాగా జీవితాంతమూ ఆకుర్రవాడికి మనశ్శాంతిలేకుండా చేయటం మంచిదా?" అని బోధ చేశాను.

కుసుమ యెలా అర్థం చేసుకుందో చెప్పలేను— ఆ పిల్ల ఒకసారి యేడుస్తూ, మరోసారి ముభావంగా కూర్చుంటూ వుండేది. 'అయితే యీ ప్రయత్నం విర మించు కుందాము'అని నేను అంటే, అధీరురాలయేది. చివరకు శ్రీపతిద్వారా నీవద్దకు వివాహ ప్రస్తావన

పంపాము. నీవు తక్షణమే వివాహానికి సమ్మతించావు: ముహూర్త నిశ్చయం జరిగిపోయింది.

పెళ్ళి రేపు జరుగుతుందనగా, కుసుమ మనస్సంతా వికలమైపోయింది; ఆమెను వూరడించటం కష్టమైంది. కుసుమ నా కాళ్ళమీదపడి — "పెదనానా, యీ పెళ్ళి చేయవద్దు" అంది. "పిచ్చితల్లీ! అన్నీ సిద్ధం చేసుకున్నాం. యిప్పుడు యెలా మాట తప్పగలం!" అన్నాను నేను. "అకస్మాత్తుగా జబ్బుచేసి, చనిపోయిందని చెప్పి, నన్ను యెక్కడికైనా పంపించు" అన్నది కుసుమ. "మరి, ఆ కుఱ్ఱవాడి స్థితి యేంకావాలి! అతని చిరకాలవాంఛ యీడేరుతుందని ఆనందంలో తేలియాడుతున్నాడు. యివాళ ఆకస్మికంగా వెళ్ళి, నీ మరణవార్త చేవినివేసి, మళ్ళీ మరునాడే అతని మరణవార్త నీకు చేర్చేదా! యిక ఆ సాయంత్రమే నీ చావుకబురు చల్లగా వినమంటావా! యీ వృద్ధాప్యంలో స్త్రీహత్య, బ్రహ్మహత్యా పాపాలకు వొడిగట్టటం నావల్ల కాదమ్మా!" అని చెప్పాను.

ప్యారీ శంకరు కొంచెం ఆగి, మళ్ళీ చెప్ప నారంభించాడు:

"తర్వాత శుభముహూర్తంలో యీ శుభ వివాహం జరిగిపోయింది. నేనొక కర్తవ్య భారంనుంచి విముక్తి పొందాను. తర్వాత విషయమంతా నీకు తెలును !"

"నీకు చేతనయిందేమిటో చేసి చూపావు— మరి యీ రహస్యం దేనికి బయటపెట్టావు ?" అని అడిగాడు హేమంతు.

"మీ చెల్లెలు పెళ్ళికి లగ్నాలు పెట్టుకున్నారని తెలిసింది. ఒక బ్రాహ్మణుని, కర్తవ్యవశాత్తు కుల భ్రష్టుణ్ణి చేశాను; యీసారి అయినా మరో బ్రాహ్మడు కులభ్రష్టుడు కాకుండా కాపాడాలని మనసులో ఆలోచించు కున్నాను. అందువల్ల వరపక్షం వారికి హేమంతుడు శూద్ర బాలికను వివాహమాడినట్టు నాదగ్గర తగిన రుజువు వుందని వుత్తరం వ్రాశాను !'

హేమంతుడు గుండె దిటవు చేసుకుని—"యిప్పుడు నేను కుసుమను త్యజిస్తే, ఆమెగతి యేంకావాలి ? నీవు ఆశ్రయమిస్తావా ?" అన్నాడు.

"నా కర్తవ్యం నేను నిర్వహించాను. భర్త విడిచి పెట్టిన స్త్రీని పోషించటం నాపనికాదు !, ఎవర్రా యింట్లో ? హేమంతబాబుకు మంచుగడ్డవేసి, కొబ్బరిపీళ్ళు పట్టుకు రాండి; తాంబూలంకూడా !"

హేమంతుడు ఆ చల్లని ఆతిధ్యంకోసం నిరీక్షించ కుండానే లేచి వెళ్ళిపోయాడు.

## 4

ఆవాళ తిథి కృష్ణపక్ష పంచమి. చీకటిరాత్రి. పక్షుల కూజితాలు సద్దుమణిగినవి. చెరువు గట్టున వృక్షాలు నల్లని చిత్రపటంమీద చిక్కని సిరా పులిమినట్టున్నది. పిల్లవాయువులు, అంధకారం పట్టి బంధించినట్టు గుడ్డివాని మాదిరి ఆ చీకట్లో తారట్లాడుతున్నవి. ఆకాశంలో నక్ష త్రాలు రెప్ప వాల్చకుండా, సతర్క దృష్టితో చీకటులను భేదించి, యేదో రహస్యోద్ఘాటన చేయ సంకల్పించుకున్న ట్టుంది.

హేమంతుని పడకగదిలో యివాళ సందె దీపం వెలిగించలేదు. అతను కిటికీకి దగ్గరగా మంచంమీద కూర్చుని, దట్టమైన చీకటికేసి చూస్తున్నాడు; క్రింద కుసుమ రెండు చేతులతో అతని పాదాలు పట్టుకుని, తల ఆ పాదాలకు ఆనించి వుంది. కాలచక్రం స్తంభించిన సముద్రం మాదిరి నిలిచి పోయింది. అదృష్ట చిత్రకారు డయిన విధాత, అనంత నిశిమీద ఒక శాశ్వత చిత్రం లిఖించి నట్టుంది. నలువైపులా ప్రళయం; మధ్య న్యాయమూర్తి; అతని పాదాలచెంత ఒక అపరాధిని!

మళ్ళీ ఆ చెప్పుల టకటక వినిపించింది.

హరిహర ముఖర్జీ గుమ్మందాకా వచ్చి —"చాలా సేపయింది; యిక వ్యవధి యివ్వలేను. తక్షణమే భార్యను యింట్లోనుంచి పంపించివెయ్ !" అన్నాడు.

హేమంతుడు లేచి వచ్చి తండ్రితో — "వివాహమాడిన భార్యను పరిత్యజించలేను !" అని చెప్పాడు.

హరిహర ముఖర్జీ గర్జించాడు. "అయితే, కులం వదులుకుంటావా ?"

"నేను కులభేదాలు పాటించను."

"అయితే, నీవుకూడా తక్షణమే వెళ్ళిపో !"



# ఇల : కల

[ఇంద్రసభ : దేవరాజు ఇంద్రుడు, దేవగురువు బృహస్పతి, సేనాని కార్తికేయుడు, విశ్వ సమస్యలను చర్చిస్తూంటారు.]

ఇంద్రుడు: దేవగురూ! రాక్షసులు స్వర్గంపై దండువెడలి మనల్ని పారద్రోలడానికి యత్నించిన విషయం తమకు తెలుసు. అప్పుడు మనం మానవ సహాయంతో వారిని జయించాం. కాని, ఈనాడు అంతకన్నా భయంకరమైన ప్రమాదం మనల్ని ఎదుర్కొన్నది. తమరు మరి ఇప్పుడు ఎలా సలహా ఇస్తారో....

బృహస్పతి: దేవరాజా! నీ మాటలు నాకు బోధపడడం లేదు. మనకు ప్రమాదం వాటిల్లిందా? అనగా నీ భావం?

ఇంద్రుడు: స్వర్గమే లేకుండా పోతున్నది.

బృహ: అనగా? ఇప్పుడు మనం నివసిస్తూ ఉన్నది స్వర్గంలో కాదూ?

ఇంద్రుడు: మనం స్వర్గంలో నివసిస్తున్న మాట వాస్తవమే. కాని, మనం జీవిస్తున్నది ఒక జీవితం

కాదు. ఒక అలవాటుగా మన జీవితం సాగిపోతూ ఉన్నది. కాని అంతకు మించిన ఉజ్వలత మన జీవితాలలో కనుపించడంలేదు. నానాటికీ మన స్వర్గం సన్నగిల్లి ఒక నీడగా మారి క్రమ క్రమంగా అదృశ్యమైపోతూ ఉన్నది.

కార్తి: మీరు చెబుతూన్నది నిజమే కావచ్చు దేవరాజా! కాని నాదో చిన్నసందేహం. మన ఆచార వ్యవహారాలు, కార్య కలాపాలు మామూలు ధోరణిలోనే సాగుతున్నవి కదా? పురాతన శోభ వాటినుంచి ఏమాత్రం తొలిగిపోలేదు.

ఇంద్ర: ఆచార వ్యవహారాల విషయమా? నీవు చెప్పిన మాట నిజమే. వాటి సంఖ్య రోజు రోజుకూ హెచ్చవుతున్నది. దర్జాలు, దర్పాలు కూడా హెచ్చవుతున్నవి. కాని ఈ దర్జాలు, దర్పాలు సంధ్యా కాంతి వంటివే కాని; ఉషః కాంతి వంటివి కాదు. నిజం చెప్పాలంటే ఈనాటి స్వర్గం నామ మాత్రావశిష్టంగా ఉన్నది, అంతే. స్వర్గాన్నిచూచి ఈనాడు రాక్షసులుకాని, మరెవరుకాని ఎంత మాత్రం అసూయ చెందడంలేదు. ఒకప్పుడు

స్వర్గం అనుక్షణం దండయాత్ర భయంలో నివసించేది. అదే నిజమైన స్వర్గం.

కార్తి: అవును. మీరు చెబుతున్నది ఇప్పుడిప్పుడే నాకు అర్ధమవుతున్నది.

బృహ: ఒక స్వప్నంనుంచి మేలుకున్న తరువాత మనం స్వప్నాన్ని కాంచినట్లు ఎలా తెలుసుకొనగలమో, అలా మీ మాటలు విన్నతరువాత మాకు నిజస్థితి గోచరిస్తున్నది.

కార్తి: చూడండి — నావిషయం చెబుతాను. నా కవచ ఖడ్గాలను చూచుకుని నేను అంతా క్షేమంగానే ఉన్నానని భావిస్తున్నాను. నలుప్రక్కలా కలయ చూస్తాను. నా కవచ ఖడ్గాలను ఉపయోగించడానికి ఎవరూ కనుపించరు. ఉపయోగం లేని ఈ అలంకారాలన్నీ ఎందుకా అనిపిస్తుంది.

బృహ: స్వర్గం ఈ దశకు రావడానికి కారణాలను మనం యోచించాలి.

ఇంద్ర: స్వర్గానికీ స్వర్గంయొక్క పునాదికీ సంబంధం లేకుండా పోయింది. ఇదే ముఖ్య కారణం.

బృహ: ఏ పునాది ?

ఇంద్ర: పృథ్వీ దేవతలకు సాయం చేయడానికి మానవుడు స్వర్గానికి వస్తూ వచ్చిన రోజులు మీకు జ్ఞాపకమే ననుకుంటాను. దేవతలుకూడా అలాగే మానవునికి సాయం చేయడానికి భూలోకానికి వెడుతూ వచ్చే వారు. స్వర్గ మర్త్య లోకాలకు అప్పుడు ఎడ తెగని సంబంధం ఉండేది. స్వర్గ మర్త్య లోకాలకు సంబంధం ఉన్నప్పుడుకాని స్వర్గానికి క్షేమం లేదు.

కార్తి: మర్త్యలోకం కూడా ఇప్పుడు వినాశన స్థితిలోనే ఉన్నది. మానవుడు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయాడు. స్వర్గ మర్త్యాలకు లంకె తెగిపోవడంవల్ల మానవుడు జ్యోతిర్లోకాలను అధిగమింప లేకుండా ఉన్నాడు.

బృహ: ఈ దుర్దశనుంచి తప్పించుకోడానికి మనం ఏంచేయాలి ?

ఇంద్ర: స్వర్గ మర్త్య లోకాలకు తెగిన లంకెను తిరిగి ఏర్పరచాలి.

బృహ: కాని, ఇంతకు పూర్వం దేవతలు స్వర్గంనుంచి మర్త్యలోకానికి దిగుతూ వచ్చిన బాట ఇప్పుడు పూర్తిగా చెరిగిపోయింది. ఇప్పుడు ఆ బాటను గుర్తించలేము కూడా. ఈ బాటను మనం తిరిగి

తీర్చి దిద్దగలిగినప్పుడే స్వర్గానికి క్షేమం కలగ గలదు.

ఇంద్ర: అవును. తమరు చెప్పినమాట నిజమే. అమృత మధుపాన మత్తులమై మనం సత్యానికి దూరులమై పోయాము. ఈలోగా స్వర్గ మర్త్య లోకాల బాట చెరిగిపోయింది.

కార్తి: రాక్షసులను జయించిన తరువాత స్వర్గాన్ని కంచు కోటగా నిర్మించాం. శత్రువుల తాలూకు పురుగు కూడా జొరబడడానికి దుర్భేద్యంగా ఉండేది స్వర్గం. కాని మనం రాను రాను పురోగామి పథానికి ఎంతో దూరమైపోయాం. ఇతర సృష్టికీ మనకూ మధ్య అగాధం పెరిగిపోయింది. అందుచేతనే ఈరోజున మనం ఒంటరి వాళ్ళంగా ఉన్నాము.

ఇంద్ర: పురోగతికాని, తిరోగతికాని, మనం ఇతర ప్రపంచంనుంచి దూరం కావడం పొరబాటు. అందువల్ల మన బ్రతుకు కేవలం నిరర్థకమై పోతుంది. ఈ రోజున స్వర్గకాంతి మర్త్యలోకం లోని దీపకాంతిలో ప్రతి ఫలించడంలేదు. స్వర్గానికి చుట్టూ ఒక పెద్ద కోటగోడ పెరిగిపోయింది. ఈ గోడలను కూలద్రోసి మనం స్వేచ్ఛావాయువులను

ప్రసరింపనీయాలి. అజ్ఞానులతో, అధోజగత్సహోదరులతో మన సంబంధాన్ని తిరిగి నెలకొల్పుకోవాలి.

బృహ: అందుకు మార్గం?

ఇంద్ర: నేను స్వయంగా మర్త్యలోకానికి వెడతాను.

బృహ: స్వర్గ మర్త్య లోకాల బాట పూర్తిగా చెరిగిపోయింది దేవరాజా!

ఇంద్ర: నేను ఈసారి అమరజీవిగా మర్త్యలోకంలో అవతరించ దలచలేదు. మానవుణ్ణిగానే మర్త్యలోకంలో అవతరించ దలిచాను.

బృహ: తమరు పృధ్వీస్థలిలో ఏ ఇంట జన్మించ దలచుకున్నారు దేవరాజా? ఇప్పుడు పృధ్వి తమరు జన్మించడానికి తగినట్లుగా లేదు. ఈ రోజున వణిక్కులు భూదేవిని పాలిస్తున్నారు. బ్రాహ్మణులు వారి సేవ చేస్తున్నారు. క్షత్రియులు సైతం వారినే రక్షిస్తున్నారు.

ఇంద్ర: ఏ ఇంట జన్మించాలో నిర్ణయించుకొనడం నా వంతు కాదు. ఏ ఇల్లు నన్ను ఆకర్షిస్తే ఆ ఇంట జన్మిస్తాను.

బృహ: మీరు ఇంద్రుడననే విషయాన్ని ఎలా మరిచిపో
గలుగుతారు ?



ఇంద్ర: ఆ స్మృతిని పూర్తిగా చెరిపివేసుకుని మానవునితో
పూర్తిగా కలిసిపోతాను.



కార్తి: భూలోకం అంటూ ఒకటి ఉన్నట్లుకూడా నేను
మరిచిపోయాను. ఈ రోజున మీ మాటలు నాలో
నూతనోద్వేగాన్ని కలిగించాయి. ఉదయసంధ్యా
సమయాలలో ఆశతో స్వర్గంవైపు చూచే పృధివి
నా కళ్ళకు కట్టినట్లుగా ఉంది.



ఇంద్ర: స్వర్గం తనకొరకు అనుక్షణం ఆవేదనతో
నిట్టూరుస్తున్నదని దక్షిణ పవనంద్వారా పృధివికి
కబురుపంపుతాను. సప్త సముద్రాలు విరహభారం
భరించలేక స్వర్గం విడిచిన అశ్రులేకావూ !

కార్తి: దేవరాజా ! మీరు అనుజ్ఞనిస్తే మేమూ తమను
అనుసరించి భూలోకంలో అవతరిస్తాం.

బృహ: మృత్యు యవనికను చీల్చుకుని మహోజ్వలంగా
ప్రకాశిస్తున్న ఆ అమరదీప్తిని అవలోకిస్తాం.

కార్తి: పృధివిలో నా అవసరంకూడా ఉన్నది. నా సేనాధి
పత్యం పృధ్విలో లోపించడంవల్లనే మానవుడు

మహాదాదర్శాల కోసం పోరాడడానికి బదులు క్షుద్రమైన వాంఛల కొరకు పోరాడుతున్నాడు.

బృహ: నేను లేని లోపంవల్లనే మానవుడు విజ్ఞానాన్ని విజ్ఞానంకొరకే ఉపాసించడానికి బదులు భౌతిక ఉపయోగాలకొరకు దుర్వినియోగం చేస్తున్నాడు.

ఇంద్ర: మంచిది. నేను మీ కొరకు బాటను సిద్ధంచేసి ఉంచుతాను. అవసరమైన క్షణంలో మీరు అవతరించవచ్చు. పండిన పండు కొమ్మనుంచి రాలినట్లు మీరు పృధ్వికి రావచ్చు.

కార్తి: ఆక్షణాన్ని మేము ఎలాగుర్తించగలం దేవరాజా?

బృహ: ఎంతో సులభం ఆ క్షణాన్ని గుర్తించడం. ఆ క్షణంలో పృధ్వీమాత విజయధ్వానాలతో స్వర్గం పిక్కటిల్లిపోతుంది.

ఇంద్ర: అది కాదు దేవగురూ! విజయధ్వానం కాదు మీకు వినిపించేది. నా ఆదర్శం సఫలమైన వార్తను స్వర్గ పవనాలు మీ చెవుల్లో వేస్తాయి.

కార్తి: అంతవరకు మీరు ఏ ధూళిగర్భంలో దాగిఉన్నారో కనుగొనడం దుస్తరమనుకుంటాను.

బృహ: భూలోకంలో అంతా దాగుడిమూతలాట ఆడుతారు. కలిమిలేమి చాటున దాగి ఉంటుంది.

దర్పులతే అధికారం చెలాయిస్తారు. విజయం అపజయం చాటున చోటు చేసుకుంటుంది.

సాధ్యం అసాధ్యంగా కనుపిస్తుంది.

దృశ్యం ఎప్పుడూ సత్యంకాదు. అదృశ్యమే సత్యం.

కార్తి: కాని దేవరాజా! నాకు ఒక అనుమానం కలుగుతూ ఉంది. ఈరోజు మీ ఫాలస్థలంలోని వర్చస్సు ఎందుచేతనో సన్నగిలినట్లు కనుపిస్తూఉంది.

బృహ: మానవుని కొరకు తమరు ధరించనున్న అవతార కాంతి ఉజ్వల తారవలె తమ ఫాలభాగంలో ప్రకాశిస్తుంది గాక!

ఇంద్ర: దేవగురూ! అప్పుడే నాలో ప్రసవ వేదన ప్రారంభ మైంది. స్వర్గంనుంచి దూరమవుతూ ఉన్నాను. స్వర్గ మర్త్య లోకాలను కలపడానికి నే నెన్నో బాధలు పడాలి. ఆత్మనివృత్తి జీవన కంటక పథానికి ఆవలిగట్టు.



# బాట

ఎందరెందరో పాన్థుల పాదముద్రలతో రూపొందిన బాట ఇది.

అడవిదాటి, బయలుదాటి, ఒక నదీ తీరాన్ని చేరుతుందీ బాట.

నదిదాటి ఆవలిగట్టున తిరిగి మొలకెత్తి నిద్రించే గ్రామంలో కలసిపోతుంది. మధ్యలో పొలాలు, మామిడి తోపు, ఒక కొలను, బీడు ఇవన్నీ దాటి సాగిపోతుంది బాట. కడకు మనం పేరు చెప్పలేని అనూహ్య విదూర పథాంచలంలో ఎక్కడో కలసి మాయమవుతుంది.

ఈ బాటలో ఎందరెందరో నడిచివెళ్ళారు, స్త్రీలు, పురుషులు, కొందరు మిత్రులు, కొందరు అపరిచితులు, కొందరు అవగుంఠనాచ్ఛాదిత వదనులు, కొందరు నగ్న వదనులు, కొందరు కావటికుండలు మోసుకుని పోతున్నవారు.

ప్రొద్దు క్రుంకింది. చీకటి వ్యాపిస్తున్నది. ఇంతకు మునుపు ఈబాట 'నాదీ' అనిపించింది. ఇప్పుడు ఈ బాటలో ఒకేసారి పయనం చేస్తానేమో అని పిస్తున్నది.

ఇది ప్రగతి పథం. తిరోగామి పథంకాదు. ఒక సారికూడా ఈ బాటలో నడిచివెళ్ళి తిరిగిరాలేను.

ఈ మసక సంజలోనుంచి ఒక్కమాటు నేను నడిచి వచ్చిన ఈ బాటను స్మరించుకుంటే మాసిన అడుగు జాడల ఛంధస్సుతో అల్లిన ఒక గీతంలా కనుపిస్తూ ఉన్నది ఈ బాట.

యాత్రికులు వచ్చారు, వెళ్ళారు. ప్రతి యాత్రికుని గాథ ఒక అడుగుజాడగా ఈ బాటలో నిల్చిపోయింది. దిగంచలాలను ఈ అడుగుజాడలు కలుపుతున్నాయి.

'ఓ బాటా! నీ దుమ్ములో దాగిఉన్న యుగ యుగాల చరిత్రను నాకు వినిపించవూ? చెవులొగ్గి వింటాను'-అని బాటను అడుగుతాను.

కాని బాట జవాబు చెప్పదు.

అంధ నిశావనికవైపు వేలుచూపి మౌనంగా ఊరు కుంటుంది బాట.

'ఓ యుగయుగాలనాటి మహాపథమా! నీపై నడచిన అనంతకోటి యాత్రికుల భావాలు, వాంఛలు ఏమైనాయి?'- అని ప్రశ్నిస్తాను.

కాని బాటయొక్క మౌనవ్రతం భంగంకాదు. ఉదయ సంధ్యలవైపు వేలుచూపి బాట మెల్లగా ఊరు కుంటుంది.

'ఓ బాటా! నీపై పూలజల్లులా కురిసిన అడుగులు ఇంకా ఉన్నవా?' అని ప్రశ్నిస్తాను.

బాటకు సమాధానం తెలుసా? అవధీ తెలుసునా? వాడినపూలు, రుద్ధ స్వరాలు ఎక్కడికి చేరుతున్నవో అమరవేదన చుక్కకూ చుక్కకూ మధ్య ఎక్కడ వ్యక్త రూపం పొందుతున్నదో తెలుసునా?

---

# విచిత్ర భిక్షువు

'బుద్ధదేవుని ఆదేశానుసారం ఈ భిక్షాపాత్రను చేబట్టి అర్థిస్తున్నాను. నగరవాసులారా! మేలుకొండి! మీకు తోచింది ధర్మంచేయండి—'రాజధాని శావస్త్రీపురం నగరవీధులలో ఈ కేక వినిపించింది.

ఇంకా తెల్లవారలేదు. తూర్పున ఒక ఉషోరేఖ మటుకు తోచింది. నగరవాసులు ఇంకా నిద్రిస్తూనే ఉన్నారు. అప్పుడే కుక్కుటాలు మేలుకొలుపు పాటలు ప్రారంభించాయి.

'మేలుకొనండి! వినండి! మేఘాలు తమ సర్వస్వాన్ని పృధివికి దానంచేస్తున్నవి.

పరిత్యాగానికి మించిన ధర్మం మరొకటిలేదు—' కేక ప్రతిధ్వనించింది.

చక్రవర్తి ఈమాట విన్నాడు. పదవిలోని అర్థరాహిత్యాన్ని ఆలోచించాడు. శ్రీమంతులకుసైతం పరిత్యాగ వాంఛకలిగింది. ఒకపిల్ల కనులవెంట అశ్రువులు ధారలుగా రాలాయి. ఇహ సుఖాలన్నీ చెదిరి రాలిన పూలవలె తోచాయి.

కిటికీతలుపులు తెరుచుకుంటాయి. నగరవాసులు స్త్రీలు, పురుషులు, ఉషఃకాంతులలో భిక్షువును అవలోకిస్తారు. అతను ఒంటరిగా నడుస్తూ వీధుల్లో వెడుతూ ఉంటాడు.

వర్తకులు వజ్ర వైఢూర్యాలను తీసుకునివచ్చి సన్యాసికి సమర్పిస్తారు. అతను వారిని తిరిగిపంపివేస్తాడు. తన చేతిలోని శూన్య భిక్షాపాత్రను ఎత్తిపట్టి, "నగర వాసులారా ! వినండి ! మీ వస్తువు లన్నిటిలోకి విలువైన వస్తువును ఇవ్వండి!" అని కేకవేస్తాడు.

అతను శ్రీమంతుల వీధులను గడచి పేదల వాడలో ఒక చీకటి సందులో ప్రవేశిస్తాడు. అక్కడ ఒక స్త్రీ ఆతని కేకవిని గుడిసెలోనుంచి వెలుపలికి వస్తుంది. అతని పాదధూళిని భక్తితో శిరస్సునదాల్చి, 'ఒక్క క్షణం ఉండండి స్వామీ' అనిలోనికి వెడుతుంది.

లోనికివెళ్ళి తలుపు చాటున నిల్చి తన చిరుగుల విడిచి బైటికి విసిరివేస్తుంది.

ఆ స్త్రీ తన కున్నదంతా ఇచ్చింది. నగ్నంగా నిల్చుంది.

భిక్షువు వదనం ఆనందంతో వెల్లివిరుస్తుంది.

'నీవు పుణ్యమూర్తివి తల్లీ! నీదానం చక్రవర్తి సామ్రాజ్య దానంకంటే గొప్పది!—'అంటాడు భిక్షువు.

ఆ చిరుగుల చీరను హృదయానికి హత్తుకుని ప్రభువుకు సమర్పించడంకోసం తరలిపోతాడు భిక్షువు.

# సంపాదకుడు

నా భార్య వుండగా, నాకు ప్రభను గురించి యేచింతా లేదు. అప్పుడు ప్రభకంటె, ప్రభ తల్లి విషయమై యెక్కువ ఆదుర్దా పడేవాణ్ణి!

పూర్వం ప్రభ ఆట పాటలు చూసి, వచ్చీరాని మాటలు విని, కాసేపు ముద్దులాడగానే మనసు సంతోషంతో నిండిపోయేది, యిష్టమయినంతసేపు ఆడించేవాణ్ణి. యేడ్పు లంకించుకోగానే, తల్లికి అప్పగింతపెట్టి, సెలవు పుచ్చుకునేవాణ్ణి. ఒకనాడు నేనే ప్రభను శ్రద్ధాశక్తులతో పెంచి పెద్దచేయవలసి వస్తుందని కల్లోకూడా అనుకోలేదు.

అకస్మాత్తుగా నా భార్య కాలం చేసింది; ఆనాడు ప్రభ తల్లి చంక వీడి, నా వొడిలోవచ్చి తల దాచుకుంది. నేను ప్రభను హృదయానికి హత్తుకున్నాను.

'తల్లి లేని పిల్లను అల్లారుముద్దుగా పెంచటం నా విధి' అని నేను యెక్కువగా యోచించానో; లేక 'భార్య పోయిన తండ్రిని అపార స్నేహభావంతో సంరక్షించటం

తన విధి' అని ప్రభ యెక్కువగా భావించేదో యిప్పటికీ నాకు అవగాహన కాలేదు. కానీ ఆరేళ్ళ ప్రాయంలోనే ప్రభ నా విషయమై 'పెద్ద ముత్తయిదువ' మాదిరి, వ్యవహరించసాగింది. ప్రేవెడు లేని పిల్ల, తండ్రి మంచి సెబ్బరలు గమనిస్తూ, గృహ యజమానురాలు కావటానికి ప్రయత్నించటం కళ్ళకు కట్టినట్టు కన్పిస్తూ వుంది.

నేనూ లోలోపల నవ్వుకుంటూ, నా బరువు భారం ప్రభకు అప్పగించాను. నాలో అలసత్వమూ, నిస్పృహాయత అధికమయినకొద్దీ, అమ్మాయికి సంతోషంగానే వుంది. నేను పొరపాటున యెప్పుడయినా చొక్కాగాని, గొడుగుగాని నా చేతితో ముట్టుకుంటే, అనధికారజోక్యం కలిగించుకున్నట్టు సూచనప్రాయంగా వ్యక్తపరచేది! ప్రభకు 'తండ్రిగారి'వంటి పెద్ద బొమ్మ, అంతకుపూర్వం యెన్నడూ దొరకలేదు; అందువల్ల 'తండ్రిగారి'కి అన్న వస్త్రాలు యిచ్చి, నిద్రపుచ్చి, అహోరాత్రులు పరమానంద పడుతుండేది. అమ్మాయి పుస్తకం పట్టుకుని, చదువుకోటానికి వచ్చినప్పుడు, పితృత్వాన్ని తలపుకు తెచ్చుకోవలసి వచ్చేది!

అమ్మాయిని యోగ్యుడయిన కుర్రవాడి చేతిలో పెట్టటానికి చాలా డబ్బు కావాలి–కాని నాకు అంత డబ్బేది!–

అని మధ్య మధ్య నాకు చింతగా వుండేది. ప్రభను నాశక్తికొద్దీ చదివించి, యోగ్యురాలిని చేయగలను. కాని యే మూర్ఖుడి చేతిలోనో పడితే, పిల్లగతి యేంకాను?

దీర్ఘంగా యోచించి, ధనార్జనకు వుపక్రమించాను. నాకు గవర్నమెంటు వుద్యోగం చేసే వయసు దాటిపోయింది; యేదైనా యితర ఆఫీసుల్లో ప్రవేశించే శక్తి కూడా లేదు. చివరకు గ్రంథరచన చేయాలని నిర్ణయించుకుని, అందులో నిమగ్నమయాను.

వెదురువాసం చిల్లులు పడినప్పుడు, అందులో నీరుగాని, నూనెగాని నిలవదు. అసలు దాని ధారణశక్తే అడుగంటుతుంది. యికను యింటిపనులకు కూడా వుపకరించదు. కాని, దానితో చేతి తడి వదలకుండా, పిల్లన గ్రోవి చేసి, చక్కగా వాయించవచ్చు. కుటుంబ వ్యవహారాల్లో, యెందులోనూ మనస్సు లగ్నంకాని దురదృష్టవంతుడు నిస్సందేహంగా మంచి గ్రంథాలు వ్రాయగలడని మాత్రం నాకు గట్టి నమ్మకం. యీ ధీమాతోనే నేనొక ప్రహసనం వ్రాశాను. పాఠకులు మెచ్చుకున్నారు; రంగస్థలంమీద కూడా ప్రదర్శించారు.

అకస్మాత్తుగా కీర్తికాంత వరించటంతో పెద్ద చిక్కున పడ్డాను; యిరవైనాలుగుగంటలూ వూపిరి పీల్చు

కోటానికి కూడా తీరుబాటు లేకుండా, రచనావ్యాసంగంలో లీనమైపోయాను.

ఒకనాడు ప్రభ నావద్దకు వచ్చి, ముద్దుగా, స్నేహ పూర్వకంగా నవ్వి "నాన్నగారూ! స్నానానికి లేవరూ?" అంది.

"వెళ్ళు, యిప్పుడు కాదు. వ్రాసుకునేటప్పుడు మధ్యలో వేధించమాకండి" అని గర్జించాను.

అమ్మాయి మోము, వూది ఆర్పివేసిన దీపంమాదిరి అయినట్టుంది. ప్రభ అభిమానపడి, వ్యధిత హృదయంతో నిశ్శబ్దంగా యెప్పుడు అక్కడనుంచి వెళ్ళిపోయిందీ నాకేమీ తెలియదు.

నేను పరిచారికను చీవాట్లు పెట్టేవాణ్ణి; నౌకర్ని, మీదబడి కొట్టబోయేవాణ్ణి; బిచ్చగాళ్ళు వస్తే, వంకె కర్ర తీసుకుని వెంటబడేవాణ్ణి. మాయిల్లు దారితల! యెవరైనా కొత్తవాళ్ళు, దారి అడిగితే, తిన్నగా నరకానికి మార్గం చూపేవాడిని! వీళ్ళతో యెంతబాధ! నేను యెంత వుదాత్తము, రసవత్తరము అయిన ప్రహసన రచనలో మునిగి వున్నానో వాళ్లు అదేమీ పట్టించుకోరు!

కాని, కీర్తి, ఆనందము— వీటికి తగినట్టుగా ధనం చేకూరకపోవటం, విచారకరమయిన విషయమే. అసలు

నాకు ఆ సమయంలో డబ్బుసంగతే గుర్తులేదు! యిటు గోకులంలో, యోగ్యులయిన యువకులసంఖ్య, తండ్రులకు 'కన్యాదాయం' నుంచి విముక్తి కలిగించాలనే సంకల్పంతో నానాటికి వృద్ధి అవుతూవుంది; కాని నాకు ఆ ధ్యాసేలేదు.

లోపల మంట ప్రారంభమయితేగాని, ఆకలి యెక్కడో తెలియదు; నా స్థితీ అలానే వుంది. అంతలో ఒక సదవకాశం లభించింది. అహీరగ్రామ జమీందారు పత్రిక నెలకొల్పాలని సంకల్పించుకుని, నన్ను సంపాదకుడుగా వుండమని బలవంతం చేశాడు. పెద్ద వేతనం; నేనూ అంగీకరించాను. సంపాదకుణ్ణయి, కొన్నాళ్ళు యెంత నిశితంగా వ్రాశానంటే, దారిని వెళ్ళేటప్పుడు నన్నుగురించి ప్రజలు పరస్పరం పరిచయం చేసుకుంటూ వుండేవారు చేసన్నలతో! మధ్యందిన భానుమండలం మాదిరి దుర్నిరీక్ష్యంగా భావించుకునేవాణ్ణి నన్ను!

అహీరగ్రామం చేరువలోనే జహీరుగ్రామంవుంది. ఆ రెండు గ్రామాల్లో యీ యింటిమీదకాకి, ఆ యింటి మీద వాలదు. జమీందార్లిద్దరూ ముఠాలు పడ్డారు, ప్రతి స్వల్పవిషయానికీ కర్రలు లేచేవి. చివరకు యిద్దరూ మేజస్ట్రీటుకు ముచ్చిలాకలు వ్రాసియిచ్చి, కొట్లాటలు

మానివేశారు, ప్రస్తుతం రౌడీలస్థానంలో నాలాంటి సరస్వతీ వాహకులను నియమించారు. నేను ఆ గ్రామం పరువు నిలిపానని నలుగురూ చెప్పుకోసాగారు.

నా లేఖలతో యిప్పుడు జహీరు గ్రామం తలయెత్త లేక పోతూంది. వాళ్ళ కులగోత్రాలు, పుట్టు పూర్వోత్తరాలు అన్నీ కడిగి వదిలిపెట్టాను.

అప్పుడు నాపని బాగుంది. మనిషినిగూడా నున్నపడి, వొళ్ళు వచ్చింది. నా మోము ప్రసన్నతాహాసంతో, కళకళ లాడుతుండేది యెప్పుడూ! జహీరుగ్రామ జమీందారు పూర్వీకులనుగురించి గుండెలు దూసుకుపోయే వాక్యబాణాలు వదిలేవాణ్ణి; అహీరుగ్రామం ఆలేఖలుచదివి పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుకుని, ఆనందించేది. యిలా నా స్థితి మూడు పూలు, ఆరు కాయలుగా వుంది.

జహీరు గ్రామంలోకూడా ఒక పత్రిక వెలిసింది. దానిలో ఒక ప్రత్యేకతవుంది; అది యేవిషయమూ కప్పిపుచ్చదు. ఆ పత్రిక యెంత వుత్సాహోద్రేకాలతో శుద్ధ వ్యావహారిక భాషలో దూషణ తిరస్కారాలు ప్రకటించేదంటే, అచ్చు అక్షరాలు యెగిరిపడుతూ, మన కళ్ళ ముందు నృత్యం చేస్తున్నట్టుండేది. అందువల్ల యిరు గ్రామాలప్రజలూ తేలికగా అర్థం చేసుకో గలిగేవారు.

నేను నా పూర్వ పద్ధతిలోనే, నర్మ గర్భంగా, వ్యంగ్యంగా ప్రతికక్షులమీద దండయాత్ర చేస్తూనే వున్నాను కాని; శత్రువులు — మిత్రులు యెవరూ కవి హృదయం అర్థం చేసుకో లేకపోతున్నారు. తత్ఫలితంగా లోకులు గెలుపునుకూడా వోటమిగానే యెంచుతున్నారు. చివరకు గత్యంతరంలేక, సురుచిని గురించి ఉపదేశ పూర్వకమైన లేఖ కూడా వ్రాశాను. కాని అదీ ఒక పెద్ద పొరపాటుగా తేలింది. యుక్తము, సంగతము అయిన విషయాన్ని గేలిచేయటం యెంత తేలికో, పరిహాసాస్పద మైనదాన్ని గేలిచేయటం అంత తేలికకాదు. హనువంశీ యులు, మనువంశీయుల్ని పరిహాసం చేయగలిగినంత సునాయాసంగా, మనువంశీయులు హనువంశీయుల్ని పరిహాసం చేయటంలో యెప్పటికీ సాఫల్యం పొందలేరు. వాళ్ళందరూ నా సురుచిని యెద్దేవచేసి, వొక రకంగా దేశ బహిష్కార శిక్షను విధించారు.

యజమాని పూర్వంమాదిరి, నాకు ఆదర సత్కా రాలు చేయటం లేదు; సభలూ సమావేశాల్లో వెనకటి మర్యాదలేదు. యిదివరకు దారిని వెళ్తుంటే, ప్రజలు కుశల ప్రశ్నలు వేసేవారు; యిప్పుడుఅదీ పోయింది!

ప్రస్తుతం కొంతమంది నన్ను చూసి, ముఖం చాటు చేసుకుని నవ్వుకుంటున్నారు కూడా !

ఈ లోపు ప్రజలు నా ప్రహసనాల సంగతి కూడా విస్మరించారు. నేనొక అగ్గిపుల్లననీ, ఒకటి రెండు క్షణాలు వెలిగి, మొదలంటా కాలిపోయాననీ, నాకు ఆకస్మాత్తుగా తోచసాగింది.

నేను శారీరకంగా, మానసికంగా నిరుత్సాహ పడిపోయి, తలబద్దలు చేసుకున్నా, తిన్నగా ఒక్క పంక్తి వ్రాయలేని స్థితికి వచ్చాను. జీవితంలో సుఖమనేది లేకపోయినాక, జీవించటమే వ్యర్థమనిపించ సాగింది.

అటు చూద్దామా, ప్రభ యిప్పుడు నేనంటే భయపడసాగింది. హాస్యాస్పద విషయాలు వ్రాసే తండ్రి కంటె, మట్టిబొమ్మలే పరమ ఆత్మీయులని గ్రహించింది !

రాగారాగా, ఒకనాడు 'జహీరుగ్రామ ప్రకాశ' తన ప్రతి కక్షిఅయిన జమీందారుని విడిచి, నా మీద విరుచుకు పడింది. నన్నుగురించి చాలా అసభ్యంగా వ్రాసింది; నాకు పరిచయం వున్న మిత్రులు వొకొకరే నవ్వుకుంటూ చదివి విన్పించారు. "విషయం యెలా వున్నప్పటికీ, ఆ భాషను మాత్రం కొనియాడి తీరాలి" అన్నారు కొంతమంది ! అంటే, అందులోని తిట్లన్నీ వారికి చక్కగా అర్థ

మయే భాషలో వున్నవని ! ఆనాడంతా అందరి నోటా యిది వినటంతోనే సరిపోయింది.

మా యింటిముందర చిన్న పూదోట వుంది. సాయంత్రం నేను మనశ్శాంతి కోల్పోయి, అక్కడ పచారు చేస్తున్నాను. పక్షులు గూళ్ళకు చేరుకుని, కల కూజితాలుమాని, స్వేచ్ఛగా సంధ్యా శాంతిని వరించినవి. పక్షులలో రసిక రచయితల బృందంలేదనీ, వాటిలోసురుచి విషయమై చర్చలు జరగవనీ అప్పుడు నాకు చక్కగా అవగత మయింది.

యీ తిట్టు కవిత్వానికి యెలా సమాధానం చెప్పాలా అని మనసులో తీవ్రంగా ఆలోచిస్తున్నాను. సభ్యభాషలో ఒక చిక్కువుంది: అన్ని తరగతుల ప్రజలూ, విషయం అన్ని తావులా అర్థం చేసుకోలేరు. అసభ్య భాషలో వున్న సుగణం యేమిటంటే, దాన్ని అందరూ అర్థం చేసుకో గలరు. అందువల్లనే, నేనూ, మొహంమీద కొట్టినట్లు జవాబు చెప్పాలంటే, ఆదేదారి తొక్కాలని యోచిస్తున్నా. పరాజయమనే మాట మనచెవిని పడకూడదు !

సరిగ్గా అప్పుడే, ఆసందె చీకట్లో, చిరపరిచితమైన సన్నని కంఠస్వరం విన్పించింది. వెంటనే, నా చెవిదరిని కోమలమైన వెచ్చని స్పర్శానుభూతి కలిగింది. అప్పుడు

నేను యెంత వృత్తేజంగా, అన్య మనస్కంగా వున్నా నంటే, ఆ కంఠస్వరంతో, స్పర్శతో పరిచయం వుండి కూడా వెంటనే గుర్తించ లేకపోయాను.

కాని మరుక్షణమే చిరపరిచితము, సుకుమారము అయిన ఆ కమ్మని కంఠస్వరం నా చెవుల్లో ప్రతిధ్వనించింది. అమృత తుల్యమైన ఆ మధుర స్పర్శ నా చేతికి సంజీవిని అయింది; ప్రభ నెమ్మదిగా నా వద్దకు వచ్చి "నాన్నగారూ !" అని పిలిచింది. యేమీ సమాధానం రాక ప్రభ నాకుడి చేతితో తన చెక్కిళ్ళను నిమిరింది. తర్వాత అడుగులో అడుగువేస్తూ యింట్లోకి వెళ్ళిపోయింది.

ప్రభ నన్ను యిలా పిలవటంగాని, స్వేచ్ఛగా వచ్చి యిలా 'వాత్సల్యం' చూపటంగాని జరిగి చాలా కాలమైంది, అందువల్లనే యివాళ ఆ ప్రేమపూరిత స్పర్శకు ఆకస్మికంగా నా హృదయం వ్యాకుల పడింది; విచలిత మయింది.

కొంచెం సేపయిన తర్వాత యింట్లోకి వెళ్ళాను. ప్రభ మంటలు మండే జ్వరంతో మాగన్ను పెట్టి, మంచం మీద పడుకునివుండి. తల్లి లేని నా ముద్దుబిడ్డ, సందెవేళ రాలిన పూవు మాదిరి వాడిపోయింది.

నుదుటిమీద చెయ్యి పెట్టి చూశాను, కాలిపోతూ వుంది. వడిగా శ్వాసిస్తూవుంది. నుదుటి నరాల్లో రక్తం వేగంగా ప్రవహిస్తూంది.



అమ్మాయి జ్వర తీవ్రతతో, అర్ధచేతనావస్థలోనే చిరకాల తృషార్త హృదయంతో ఒక్క పర్యాయం 'తండ్రి'ని ప్రేమగా పలకరించి పోదామని బయటకు పరుగెత్తుకువచ్చి వుంటుందని తక్షణమే గ్రహించాను: అప్పుడు 'తండ్రిగారు' అహీర గ్రామానికి నిశిత సమాధానం వ్రాసే ప్రయత్నంలో మునిగివున్నారు!

నేను ప్రభకు దగ్గరగావెళ్ళి కూర్చున్నాను. అమ్మాయి యేమీ మాట్లాడకుండా, జ్వరతప్తమయిన చేతులలోనికి నా చేయిని తీసుకుని, చెక్కిలికి ఆనించుకుని మెదలకుండా పడుకుంది.

అహీరుగ్రామము, జహీరుగ్రామము ప్రతులన్నీ తీసి, వాటికి అగ్గిపుల్ల ముట్టించాను, తర్వాత నేనేమీ సమాధానం వ్రాయలేదు.



స్వీయ పరాజయాన్ని స్వీకరించటంవల్ల యివాళ మాదిరి నాకెన్నడూ యింతగా సుఖశాంతులు, వూరట కలగలేదు.

ప్రభతల్లి పోయిననాడు, యీ పసిపాపను దగ్గరకు తీశాను. యివాళ ప్రభ మారుతల్లి చితికి దహన సంస్కారం జరిపి, మళ్ళీ ఆ పాపను హృదయానికి హత్తుకుని, క్షేమంగా స్వగృహం చేరుకున్నాను.



ప్రభతల్లి పోయిననాడు, యీ పసిపాపను దగ్గరకు తీశాను. యివాళ ప్రభ మారుతల్లి చితికి దహన సంస్కారం జరిపి, మళ్ళీ ఆ పాపను హృదయానికి హత్తుకుని, క్షేమంగా స్వగృహం చేరుకున్నాను.